# శ్రీ గురు కథా గానము

శ్రీ గురుచరితము నవరసభరితము,

శ్రీ గురుగానము చేయము నిరతము

విఘ్నములన్నియు తొలగిపోవును,

విజయములెన్నియో వరించి చేరును ॥శ్రీ గురు॥

గోదావరి తీరము పిఠాపురం పావనమైన గ్రామం

భాద్రపద శుద్ధ చతుర్థినాడు శ్రీపాద వల్లభ జననం

సుమతి ఇచ్చిన భిక్ష ఫలితము, దత్తాత్రేయుని వరము,

సమతీ అప్పళరాజు శర్మలకు దత్తాత్రేయుని జననం ॥శ్రీ గురు॥

ఏడు వత్సరముల ప్రాయమునందున శ్రీపాదునకుపనయనం
యజ్ఞోపవీతధారణతోనే చేసెను వేదగానం
పదహారేండ్ల ప్రాయమునందున సన్యాసాశ్రమ స్వీకారం
సోదరులిర్వుర స్వస్థులచేసి దేశాటనకై పయనం
కాశీ బృందావన బదరికాశ్రమం గోకర్ణ శ్రీశైలం
నివృత్తి సంగమం దర్శించి కురుపురమందున స్థిరవాసం

॥శ్రీ గురు॥

అంబాదేవి కొడుకును బ్రోచి ఆత్మహత్యను వారించి
తానే కొడుకై పుట్టగలనని అంబాదేవికి వరమిచ్చి
రజకున కొకనికి రాజభోగము కలుగునట్లుగా దీవించి
మరుసటి జన్మలో యవనవంశమున జన్మించెదవని వరమిచ్చి
ఆశ్వయుజ బహుళ ద్వాదశి దినమున కృష్ణానదిలో అంతర్హితము

॥శ్రీ గురు॥

వల్లభేశుడను బ్రాహ్మణుడొకనికి వ్యాపారములో లాభం
బ్రహ్మణ సంతర్పణ చేయుటకై కురుపురమునకు ప్రయాణం
మార్గ మధ్యమున దొంగల చేతిలో వల్లభేశుని మరణం
యతి రూపంబున శ్రీపాద వల్లభుడు చేసెను దొంగల సంహారం
తిరిగి బ్రతికిన వల్లభేశుడు చేసెను బ్రాహ్మణ సంతర్పణము

॥శ్రీ గురు॥

కాషాయాంబర కౌపీనముతో శ్రీపాదుల రూపం
రుద్రాక్షమాలా భస్మంబులతో భక్తుల బ్రోచెడి రూపం
తలపై జడలతో పద్మనేత్రుడై వెలుగొందెడి రూపం
ఉన్నతమై హిమనగమును బోలు శ్రీపాదుని దేహం
కృష్ణా స్నానము, గాయత్రి జపము స్వామికి నిత్యవ్రతము
పాదుక పూజతో అన్నదానముతో తరియుంచును జనము ॥శ్రీ గురు॥

కరంజా అను గ్రామమునందు బ్రాహ్మణులింట అంబ జనియించెను
భక్తితో శివుని పూజించెడు అంబకు మాధవశర్మతో వివాహమాయెను
ఆలస్యముగా పుట్టిన బిడ్డడు వెంటనే ప్రణవోచ్ఛారణ చేసెను
శాల గ్రామ దేవ యను బాలుని నవహరి అని అందురు పిలిచెను
॥శ్రీ గురు॥

బాలుడు త్రాకిన తల్లి రొమ్మున పాలువెల్లువై పొంగి పొరలెను
ఏడు వత్సరముల ప్రాయము వరకును ప్రణవనాదమునే ఉచ్చరించెను
సర్వసిద్ధులు తనకుదాసులని ఇనుమును స్వర్ణముగ మార్చి చూపెను
మాటలు లేవని బాధపడెడు తల్లిదండ్రులను ఊరడించెను
ఉపనయమునుచేసి చూడుడని సంజ్ఞలతోనె తెలియజేసెను
బిక్షానంతరము వేదము పఠించి భిక్షావృత్తికి అనుమతి కోరెను
తల్లి దుఃఖమును తొలగించుటకై ఒక్కవత్సరము ఆగదలంచెను
తల్లికి కవలలు జన్మించిన తదుపరి సన్యసించుటకు నిర్ణయించెను
॥శ్రీ గురు॥

శిరస్త్రాణము, చేతదండము కౌపీనము కాషాయాంబరములతో
కాశీలో బ్రహ్మజ్ఞాని శ్రీకృష్ణ సరస్వతి పాదుల శిష్యుడాయెను
నృసింహ సరస్వతిగ పేరు మార్చబడి దేశాటనకై బయలుదేరెను
మాతృదర్శనం చేసిన తదుపరి త్రియంబక నాసిక్ మంజరీకములు
సందర్శించి పావనమొందించి లీలలు చూపుచు ముందుకుసాగెను

॥శ్రీ గురు॥

మాధవార్యుడను నృసింహ భక్తునకు ధ్యానమునందున దర్శనమిచ్చెను
బాసరలోన బ్రాహ్మణుడొకనికి శూలబాధను నివారించెను
బ్రాహ్మణద్వేషి యవనుని కొలువున సాయందేవుడు హింసలు పొందెను
శ్రీ గురుడాతని బ్రోచి రక్షించి శిష్యునిగాతను స్వీకరించెను

॥శ్రీ గురు॥

వైద్యనాధమున బుద్ధిహీనుడు గురువును త్యజించి శ్రీగురు చేరెను
శ్రీ గురుడాతని మందలించుచు తానే ఆ గురువని చూపెను

॥శ్రీ గురు॥

భువనేశ్వరి క్షేత్రము భిల్లనటి అనునది శ్రీ గురు స్పర్శతో పునీతమైనది
అతి పవిత్రము ఉదంబర వృక్షము దాని మూలమున శ్రీ గురుడుండెను
మందమతి అయిన బ్రాహ్మణుడొకడు భువనేశ్వరిని భక్తితో కొలిచెను
నాలుకకోసి దేవికర్పింప శ్రీ గురునొద్దకు దేవి పంపెను
శ్రీ గురు చేరి ప్రార్థింపగానే నాలుక మొలిచి పండితుడాయెను

॥శ్రీ గురు॥

అమరపురమున పేద బ్రాహ్మణుని భిక్షనిమ్మని శ్రీ గురుడడిగెను
తనకు లభించిన చిక్కుడు కూరతో శ్రీ గురునకిల్లాలు భిక్షనొసంగెను
తిరిగి పోవుచు శ్రీ గురుడెందుకో చిక్కుడు మొక్కను పీకివేసెను
దానిని నాటిన దంపతులిర్వురు నిధిని పొంది సంతోషమందిరి
॥శ్రీ గురు॥

గంగానుజుడను బెస్తవానికి శ్రీగురు సేవలు లభ్యమాయెను
యోగినులందరు కలిసి పూజించుట గంగానుజుడు చూచి తరించెను
శ్రీగురుడాతని ఆశీర్వదించి యోగగతిన త్రిస్థలిని చూపెను
కరవీరము యుగాలయములతో పంచ గంగా సంగమము
ప్రయాగ, కాశీ, గయలతోబాటు ప్రసిద్ధమైన రెండవ త్రిస్థలి
॥శ్రీ గురు॥

శిరోలయందు బ్రాహ్మణుడొకనికి పుట్టిన సంతతి పురిటిలో కూలెను
సంగమమందున స్నానముచేసి శ్రీపాదుకలను భక్తితో కొలిచెను
శ్రీగురుడతనికి స్వప్నమందున టెంకాయలను ప్రీతితో ఇచ్చెను
వాటిని తినిన బ్రాహ్మణికపుడు ఇద్దరు బాలురు ఉద్భవించిరి
పెద్దవాడు మరణించుట కనుగొని దంపతులిర్వురు కడుశోకించిరి
పాదుకలవద్ద వుంచిన శవము ఊపిరి పొంది తిరిగి జీవించెను
॥శ్రీ గురు॥

అహంకారులు పండితులిర్వురు వేదవాదనకు త్రివిక్రము పిలిచిరి
త్రివిక్రముడు శ్రీగురుప్రార్థింప పండితులిర్వుర మందలించెను

హరిజనుడొకనికి విభూతిపూసి వేదము పాడగ ఆజ్ఞాపించెను
పండితులిర్వురు భయకంపితులై శ్రీ గురుదేవుని శరణుజొచ్చిరి
॥శ్రీ గురు॥

మాహుర పురమున గోపీనాధుడు సంపన్నుడైన బ్రాహ్మణుడు
దత్తాత్రేయుని వరప్రసాదముగ దత్తుండను పుత్రుడు కలిగెను
పదహారేండ్ల ప్రాయమునందున సావిత్రితోడ వివాహమాయెను
అన్యోన్యముతో యెడబాటులేక ప్రేమతో వారు జీవించసాగిరి
దురదృష్టమున క్షయవ్యాధి సోకి దత్తుడు క్రమముగ క్షీణింపసాగెను
మానవ యత్నము విఫలముకాగా శ్రీగురు చేరగ నిర్ణయించెను
మార్గమధ్యమున మరణించిన దత్తుని కన్గొని సావిత్రికడుదుఃఖించెను
తారసిల్లిన తాపసోత్తముడు రుద్రాక్షలను ఊది నొసంగెను
సహగమనమును చేయదలంచి సావిత్రి తా శ్రీ గురు చేరెను
శ్రీ గురుడామెను ఆశీర్వదించి దత్తుని తిరిగి జీవింపచేసెను
॥శ్రీ గురు॥

భాస్కరశర్మ అనెడి భక్తుడు ముప్పురికి భిక్షను ఈయదలచెను
శ్రీ గురునాశీర్వాద ఫలితముగ వేల సంఖ్యలో భిక్ష నొసంగెను
గాణ్గాపురమున ప్రాయములుడిగిన గొడ్రాలొకర్తె సంతతి కోరెను
శ్రీగురుడామెను ఆశీర్వదించి బిడ్డలనొసగి ప్రీతిగా పంపెను
॥శ్రీ గురు॥

నరహరి కుష్టును తొలగించుటకై ఎండిన మేడి కొమ్మను నాటెను
దానిని పెంచి చిగురింప చేసిన వ్యాధి తొలగునని వక్కాణించెను
నమ్మకముంచిన నరహరి భక్తికి మెచ్చిన మేడి చిగిర్చి పెరిగెను
వ్యాధి తొలగగా నరహరి ముదముతో శ్రీగురుకీర్తిని స్తోత్రము చేసెను
శ్రీ గురుడతనికి యోగీశ్వరుడని బిరుదునిచ్చి సత్కారము చేసెను
॥శ్రీ గురు॥

సాయందేవుని నిప్పును తెమ్మని కుంభవృష్టిలో మఠమునకంపెను
అయిదుతలల సర్పాల రెండిటిని సృష్టించి పంపెను భక్త రక్షణకై
తనను స్తుతించిన సాయందేవుని వంశమునందున భక్తిస్థిరమనె
ప్రతివత్సరము అనంతవ్రతమును జరుపుకొమ్మని ఆజ్ఞాపించెను
॥శ్రీ గురు॥

బంధువులందరు శ్రీశైలమరుగగ తంతుకుడుండెను శ్రీ గురుచెంత
తంతుకునకు శ్రీశైల మహత్మ్యము చెప్పి గొంపోయెను యోగమార్గమున
ఆలయమందున శివుని స్థానమున శ్రీ గురుదర్శనమాయె భక్తునకు
ఆనందంబున తిరిగివచ్చిన తంతుకు నెంతయొ మెచ్చిరి ప్రజలు
॥శ్రీ గురు॥

నందిశర్మ తన కుష్టు బాపమని తులజ భవానిని ప్రార్థన చేసెను
అతని భక్తికి మెచ్చిన దేవి చంచలేశ్వరిని శరణువేడమనె

పూజలందుకొని ఆ పరమేశ్వరి శ్రీ గురు సేవను చేసికొమ్మనెను
శ్రీగురుడాతని షట్కాలమందున స్నానమాడించి వస్త్రములిచ్చి
కుష్టనుబాపి ఆశీర్వదించి స్తోత్రము విని తానానందించెను
||శ్రీ గురు||

హిప్పగిరిలోన నరకేసరి కలడు కల్లేశ్వరునకు కడు ప్రియ భక్తుడు
కలలోగాంచిన శ్రీగురుదేవుని తాను స్వయంగా సేవించి తరించెను
దీపావళి ఉత్సవమున బిక్ష స్వీకరించమని భక్తులెల్లరు శ్రీ గురు వేడగ
విశ్వరూపుడై ఏకకాలమున ఏనిమిది గృహముల బిక్షను గ్రహించె
||శ్రీ గురు||

పర్వతేశుడను శూద్రుండొకడు భక్తితో శ్రీగురుప్రార్థన చేసెను
జొన్నపైరును కోసివేయుమని శ్రీగురుడాతని ఆజ్ఞాపించెను
బంధువులెవ్వరి లెక్కచేయకనే పర్వతేశుడు పైరును కోసెను
అకాలమందున వర్షము కురవగ కోసిన మొక్కలు పిలకలనిచ్చెను
పిలకలు పెరిగి పంటలు పండి ధాన్యము కుప్పలుతెప్పలాయెను
||శ్రీ గురు||

బీదరునేలెడి యవనరాజుకు స్ఫోటకమొచ్చి కృంగదీసెను
శ్రీగురుచేరి ప్రార్థన చేయగ రజకుడవీవని గుర్తుచేసెను
వ్యాధి తొలగగా శ్రీ గురుదేవుని తన రాజ్యమునకు ఆహ్వానించెను
గోవధనాపి శ్రీగురు పూజించి యవనరాజు తా ధన్యుడాయెను
||శ్రీ గురు||

ఈశ్వరలోన మఠమునందున శ్రీ గురుదేవుడు పాదుకలుంచెను
అశ్వత్థవృక్షము మూలమునందున విఘ్నేశ్వరుని ప్రతిష్టించెను
బహుధాన్యములో మాఘమాసమున కృష్ణపాద్యమి శుభఘడియలో
శ్రీశైలమందలి పాతాళగంగలో శ్రీ గురుదేవుడు పయనించిసాగెను

॥శ్రీ గురు॥

బ్రహ్మ విష్ణు ఈశ్వర రూపుడు అనసూయ అత్రి తనయుడు
దత్తాత్రేయుడు శ్రీపాద వల్లభ శ్రీగురుదేవులకిదె మంగళం
అతి పవిత్రము ఔదుంబరము అశ్వత్థమునకు శ్రీపాదుకలకు
సాయినాధునకు సకల దేవులకు భరద్వాజ గురుసార్వభౌమునకు

జయ మంగళం నిత్య శుభ మంగళం
జయ మంగళం నిత్య శుభ మంగళం

*****

